"సాధన రహస్య," "సర్వ సిద్ధాంత సౌరభా" ది బహు గ్రంథకర్తలు,

శ్రీరామకృష్ణ ఆశ్రమములు (బాపట్ల & మునిపట్నము)

సంస్థాపకులు :

పరమహంస - పరివ్రాజకాచార్య

'శ్రీ అనుభవానంద స్వామి' కృత



ఆంధ్రదేశమున 00 ప్రదర్శనలకు పైగా ప్రదర్శింపబడి

అశేష ప్రజానీకము మన్ననలు పొందిన....

# శ్రీ రామకృష్ణ - వివేకానంద
# కథాగానములు




'పరమహంస' కార్యాలయము

మునిపట్నము - 531 163 (విశాఖ జిల్లా)

తృతీయ పుష్పము

సర్వహక్కులు : ప్రకాశకులు

ముఖచిత్రము : శ్రీ అనుభవానందస్వాములవారు

ప్రథమ ముద్రణ : 1985

వెల : రు. -00



ప్రతులకు ;

1. 'పరమహంస కార్యాలయము'
   మునిపట్నము - 531 163
   విశాఖ (జిల్లా)

2. శ్రీ అనుభవానంద గ్రంథమాల
   బాపట్ల - 522 101
   గుంటూరు (జిల్లా)

ముద్రణ :
శ్రీ శారదా ప్రింటర్స్,
జి. బి. సి. రోడ్,
బాపట్ల

# అంకితం

హృదయపీఠముపైన ముదముతో నుంపగా
ఆనంద బాష్పముల - నభిషిక్తు సేయగా
సర్వార్పణంబుగా - సాష్టాంగమీయగా
అంకితము నీకిదే శ్రీ శారదామాయి -

# ఉపోద్ఘాతము

ప్రాచీనార్వాచీన దివ్య సంస్కృతీ సంపదల సమన్వయాను భవావతారము శ్రీ రామకృష్ణపరమహంసదేవుడు. ప్రాక్ప్రతీచీ సం పదాయ విశిష్టతను గ్రహించిన భారతీయాధ్యాత్మికసంపద్విభూషిత సార్వభౌముడు శ్రీ వివేకానందస్వామి. సర్వమతానుష్ఠాన తత్పరుడై, సకల మతాను భవముల నొంది, ఆ యా మతానుయాయులను అత్యంతాశ్చర్యానంద ముల ముంచిన వ్యక్తి శ్రీ రామకృష్ణ సద్గురు వరేణ్యుడు. ఆ గురు వర్యుని అనుగ్రహవిశేషమున సర్వానుభవసారమును గ్రోలి, ఆ యా మతరహస్యములనేగాక అందలి దోషములగూడ నిర్భయముగా వ్యక్త పరుపగల ధైర్యమూర్తి శ్రీ వివేకానంద యతిపుంగవుడు. కోటీశ్వరులే పాదా క్రాంతులై, దాసానుదాసులై తనను పరిశేష్ఠించియుండినను నిర్మో హుడై, నిర్లిప్తుడై, వాంఛారహితుడై, త్యాగశిఖరము నధిష్ఠించిన వైరాగ్య శిరోమణి శ్రీ రామకృష్ణుడు. అమెరికా ఖండమున కేగి, ధనాఢ్యుల నడుమ నుండినను ఆ ప్రలోభములకు లోబడక తన వ్యక్తిత్వ మును నిలుపుకొనిన త్యాగశిఖామణి శ్రీ వివేకానందుడు. 'కామము చెద పురుగువంటిది' అను సత్యమును మనసా గ్రహించి, ఆ కామనాశనము నకు మాతృమూర్తియగు కాళికాదేవిని దర్శించి, వ్యావహారిక పత్నియగు శ్రీ శారదాదేవినిగూడ జగన్మాతగ నర్చించి కామవిజయుడై, ప్రపంచము నకు ఒక నూతన సందేశమును ప్రసాదించిన మహనీయమూర్తి శ్రీ రామకృష్ణుడు. అట్టి గురుసార్వభౌముని దరిజేరి, ఆ మహాపురుషుని పరి పూర్ణ పవిత్రతను వ్యక్తము జేయుచు, అర్థకామ వ్యామోహములకు భగవ దనుభూతి అలభ్యమని ఎలుగెత్తి చాటుచు, యథార్థ బ్రహ్మచారియై, యత్యా శ్రమ స్వీకరణమొనర్చిన సన్న్యాస చక్రవర్తి శ్రీ వివేకానందుడు.

సర్వసృష్టిస్థితిలయకారిణి యగు జగన్మాత కాళికాదేవినే హృదయమున విశ్వసించి, అన్యదైవముల మనసున జొప్పింపక ఆ దివ్యశక్తినే ఆ యించి, ఉపాసించి, దర్శించి, ఆనందించి, ఆపై ఆమె నూతగా గొని, సర్వధర్మ సకల మత సమస్త దేవతారహస్యముల గ్రహించి, అనుభవించి, బోధించి, ఉపదేశించిన సామరస్యమూర్తి శ్రీ రామకృష్ణ గురుదేవుడు. అనేక దేవతల నుపాసించి, అనేక గురువుల నాశ్రయించిన నేదియు సిద్ధింపకుండుటయేగాక జంచలత్వమధికమై మనశ్శాంతి లభింపదను సత్యమును తన నిజజీవితముననే గహించి, 'ఒకమాట, ఒక బాణము, ఒక పత్ని' అను శ్రీరామచంద్రుని నాదర్శమురీతి ఒక గురువు నాశ్రయించి, నిష్ఠతో నొక దైవము నుపాసించిన సర్వము సాధ్యమని భావించి, అనేకత్వమును త్యజించి, ఏకత్వానుభూతికై సర్వాధ్యాత్మికానుభవస్వరూపుడగు శ్రీ రామకృష్ణ గురుపుంగవుని చరణద్వంద్వముల దరిజేరి, నిశ్చలుడై, నిర్మలుడై, నిరంజనుడై విరాజిల్లిన ప్రతిభాశాలి శ్రీ వివేకానందస్వామివర్యుడు.

అట్టి అపూర్వ, అనిర్వాచ్య, అనుభవమూర్తులగు నా గురుశిష్యుల సర్వాదర్శముగ గొని, తమ జీవితమున ఆ యాదర్శమునకై తపించి, కష్టించి, సాధించి తురీయాశ్రమ స్వీకరణము గావించి, శ్రీ రామకృష్ణ దేవుని సర్వమత సామరస్యమును దేశదేశముల ప్రచారము సల్పినవారు శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వాములవారు. శ్రీ రామకృష్ణ దేవునియందు వారికి గల భక్తి ప్రపత్తులు రచనల రూపమున 'శ్రీ రామకృష్ణ లీలా సంకీర్తన'మై, పద్యరూపమున 'శ్రీరామకృష్ణాంజలి'యై విరాజిల్లినవి. శ్రీ రామకృష్ణుని నారాధింపబడిన కాళికాదేవియే శ్రీ శారదాదేవి యను అభేద భావన శ్రీ స్వాములవారి హృదయమున నుప్పొంగి, 'శ్రీ దక్షిణే

శ్వరీ స్తవము'గ ప్రవహించినది. శ్రీ శారదా రామకృష్ణ వివేకానంద మూర్తి త్రయాదర్శములు వారి హృదయమున సుస్థిరములై, 'శ్రీరామకృష్ణాదర్శము', 'శ్రీ శారదాదర్శము', 'శ్రీ వివేకానందాదర్శము' లుగ బహిర్గతములైనవి. శ్రీ రామకృష్ణ దేవుని సాధనావిధానమున గల రహస్యముల గ్రహించుటచేనేమో శ్రీరామకృష్ణుని అనుభవస్వరూపునిగ నెంచి, అయ్యనుభవ సిద్ధి సాధనాచతుష్టయ సంపదలేనిదే అసాధ్యమని భావించుటచే సాధకులకు 'సాధన రహస్యము' వెలువడినది. భారతదేశమున అనేక సిద్ధాంతములుండినను, ఆ సిద్ధాంత సమన్వయము అనుభవావతారమగు శ్రీ రామకృష్ణ దేవునియందే కలదని శ్రీ రామకృష్ణ దేవుని 'సర్వ సిద్ధాంత సౌరభ' మూర్తిగా అరాధించి, అంకితమిడినవారు శ్రీ స్వాములవారు. శ్రీ రామకృష్ణుని అనుభవస్వరూపముగ భావించి, ఆనందించుటచే తాము స్థాపించిన గ్రంథమాలకుగూడ 'అనుభవానంద గ్రంథమాల' యను నామమునే నిర్ణయించుట వారి విశాలత్వమునకు, నిస్వార్థతకు నిదర్శనమనదగును.

తమ హృదయమున నానందమూర్తులై చెలువొందిన ఆ శ్రీ శారదారామకృష్ణులు శ్రీ స్వాములవారి శిల్పకళలో శ్రీ శారదా రామకృష్ణ విగ్రహములుగ బహిర్గతమై, వారిచే స్థాపితమగు ఆ మద్వ్యయమున ప్రతిష్ఠితులై సహృదయులకు ప్రశాంతిని ప్రసాదించుచున్నారు. అట్లే తమ మనోఫలకమున ప్రశాంతమూర్తులై యొప్పిన శ్రీ శారదారామకృష్ణ వివేకానంద త్రయము శ్రీ స్వాములవారి చిత్రకళా నైపుణ్యమున చిత్రింపబడి, ఆ శమద్వ్యయమున నలంకరింపబడి అత్యంతానందము నొసంగుచున్నవి. వేయేల? శ్రీ అనుభవానందస్వాములవారు త్రికరణ శుద్ధిగా శ్రీరామకృష్ణు ననుసరించిన మహనీయులు.

పైన పేర్కొనినచందము సర్వవిధముల తమ జీవితమును ఆ శ్రీరామకృష్ణుని సర్వార్పణమొనర్చుకొనినను శ్రీ స్వాములవారికి సంతృప్తి కలుగలేదేమో! 1963 వ సంవత్సరము శ్రీ వివేకానంద శతవార్షికోత్సవములు ప్రపంచవ్యాప్తముగ జరుగుచున్నవి. ఆ వత్సరమున చెరొక నూరు ఉపన్యాసములనీయ సంకల్పము. శ్రీ వివేకానంద స్వామినిగూర్చి ప్ర త్యేక కార్యక్రమము కావలయునుగదా! అందువలన శ్రీ వివేకానందస్వామి జీవితము నొక ర్తనగా వ్రాసి, మధ్య మధ్య చిన్న సంభాషణముల వ్రాసి యిచ్చిరి. బాపట్లయందలి యిరువురు చిన్ని బాలికలచే నా జీవితమును నృత్యసహిత కథాగానముగ దయారొనర్చితిమి. కాని యీ శ్రీ వివేకానందస్వామి గొప్పధనమునకు గారణమైన శ్రీరామకృష్ణ దేవుని ర్తింపకుండుట అన్యాయమేమో యనునట్లు శ్రీ స్వాములవారు వెంటనే శ్రీ రామకృష్ణ దేవుని జీవితము నొక ర్తనగా వ్రాసి, సంభాషణములగూడ దయారుచేసిరి. ఆ రెండు జీవితములును 'శ్రీ వివేకానంద కథాగానము', 'శ్రీ రామకృష్ణ కథాగానము' లుగ రూపొందినవి. ముఖ్య పట్టణములలో శ్రీ రామకృష్ణ, వివేకానందుల గూర్చి ఉపన్యసించుచు, నీ యిరువురు బాలికల నీ జీవితముల నృత్య సహితముగ కథాగానముల శ్రీ స్వాములవారు చేయించిరి. 1963 వ సంవత్సరమున నా కథాగానముల దిలకించి, ఆ దివ్య ర్తన సంభాషణముల నాలకించి ఆనందింపనివారు లేరనుట అతిశయోక్తి కాదు.

ఇట్లు వివిధరీతుల శ్రీ రామకృష్ణ దేవుని హృదయపూర్వక భక్తి ప్రపత్తులతో తమ జీవితపర్యంతము ఉపన్యాస, గ్రంథ, ఆ ామరూపమున సేవించిన శ్రీ అనుభవానంద స్వాములవారు 1973 వ సంవత్స

రము వైశాఖ శుద్ధ పూర్ణిమ శ్రీ బుద్ధ జయంతి దినమున తమ భౌతిక శరీరమును వీడి పరబ్రహ్మ స్వరూపుడగు శ్రీ రామకృష్ణుని యందు విలీనమైరి.

ఈ రెండు కథాగానములు శ్రీ స్వాములవారి ఆశీస్సులచే నేటికి ముద్రితమగుచుండుట మిక్కిలి ఆనందదాయకము. ఈ కథాగానములను బాలబాలికలకు నేర్పించి, భక్తితో శ్రీ రామకృష్ణ ప్రచారము సల్పినచో శ్రీరామకృష్ణ దేవుని దివ్యాశీర్వాదముల బొందగలరని ఆశించుచున్నాను. ఈ 'కథాగానములు' ఎవరైనా ప్రదర్శింపుకొనవచ్చును. వారికి మా అనుమతి అక్కరలేదు, కాని మాకు తెలియస్తే సంతోషిస్తాము. ఈ గ్రంథమునకు Director of Cultural Affairs, Hyderabad వారు రూ. 600/- ఆర్థిక సహాయముచేసి, మా కృషికి ప్రోత్సహించినందులకు వారికి మా కృతజ్ఞతలు.

మునిపట్నము
1-1-1985

స్వామి
త్యాగీశానంద



ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# శ్రీ రామకృష్ణ కథాగానము

ప్రశ్న:- ఇదివరకు శ్రీ వివేకానంద స్వాములవారి విషయం చెప్పుతూ, ఆయనకు గురువుగారైన శ్రీ రామకృష్ణ పరమహంస దేవుని విషయం చెప్పమంటే 'అదొక అద్భుత చరిత్ర. అర్థం చేసుకోటమే కష్టం. ఇక చెప్పటం ఎలాగ?' అన్నావు. ఆ విషయం కొంచెం చెప్పవూ!

జవాబు:- ఒక్కమాట చెప్పుతాను. విను. ఆయన ఒక విచిత్ర వ్యక్తి. ఎంత పెద్దవాళ్ళో ఆయనను అర్థం చేసుకోవాలని ఆ కాలంలోనే చూశారు. కాని సాధ్యమైతేనా?

ప్ర:- కాని, అనేకులు ఆయన దగ్గరకు చేరి, రాత్రింబవళ్ళు సేవ చేసి గ్రహించుకున్నారుగదా! అలాంటివాడేగదా మన వివేకానందుడు!

జ:- అవును. వాళ్ళైనా కొంత గ్రహించారు. శ్రీరామకృష్ణుని తత్త్వం ఒక మహాసముద్రం అంటే నమ్ము.

వ:- మరి మనం అర్థం చేసుకొనేది ఎలాగా?

జ:- అందుకనే 1963 వ సంవత్సరం అంతా వివేకానంద పండుగ కాబట్టి, వివేకానందుని జీవితాన్నేగాక, శ్రీ రామకృష్ణ జీవితాన్ని కూడా మన శ్రీ అనుభవానందులు చక్కగా వ్రాశారు.

వ:- అంటే, కథలాగానా?

జ:- కాదోయ్! మొన్న కథాగానం చేశాంకదా! అలాగే శ్రీరామకృష్ణుని కథకూడా.

వ:- అయి , నీవు నాకు యింతవరకు చెప్పలేదేమి?

జ:- అందు గా నేను యిప్పుడు పరుగెత్తుకుంటూ వచ్చింది.

వ:- అయి చెప్పు.

జ:- చెప్పటం కాదు. నృత్యగానాలతో, హావభావాలతో పాడుకుంటే ఎంతో బాగుంటుంది. ఒక్కొక్కచోట ఎంతో ఏడుపుకూడా వస్తుంది.

వ:- ఎందుకు?

జ:- కాళికాదేవిని చూడటానికి శ్రీరామకృష్ణుడు అంత ఏడిచాడు. మనకు కూడా దుఃఖం పొంగి వస్తుంది.

వ:- అంత ఏడుపు వస్తే, ఎలాగ?

జ:- అలా కాదు. ఏడుపే మనకు మోక్షాన్ని యిస్తుంది.

వ:- అలాగైతే చెప్పు. పాడుకుందాం. కాని మనమే పాడుకుంటే ఎలాగ? అందరికి వినిపిద్దామా?

జ:- దారికి వచ్చావు, భయం పోయిందన్నమాట! అయితే అందరినీ పిలుద్దాం.

ప:- ఆ. సరే!

వినరం ! వినరం !
మన రామకృష్ణుని కథాగానమును ॥వి॥

(ఇద్దరు)
అయ్యలారా! అమ్మలారా! రండి! రండి!
శ్రీరామకృష్ణ దేవునికి జయ్,
శ్రీ శారదామాయికి జయ్,
శ్రీ వివేకానంద స్వామికి జయ్,

వినరండీ! వినరండీ!
మన రామకృష్ణుని కథాగానమును ॥వి॥

జ:- అబ్బాయిల్లారా! అమ్మాయిల్లారా! అల్లరి యకుండా వింటారా? మంచి కథ చెప్పుతూ పాడతాం, ఆడతాం. పెద్దవాళ్ళందరికి నచ్చితే. ఒక్క గంట కాలం మాట్లాడకుండా విని ఆనందించండి.

ప:- మన అనుభవానందులు వ్రాసిన కథాగానాన్నే పాడుదామా?

జ:- అవును. పెద్దలారా! మా స్వాములవారు వ్రాసియిచ్చారు యీ కథాగానాన్ని. (మా మాతా వారు పాడటం, అభినయించటం చెప్పారు.)

ప:- అదంతా ఎందుకు?

జః- మన స్వాములవారు. (మన మాతాజీవారు) నేర్పితే నేర్చుకున్నాం. మనం ఆడతాం. కాని యీ పెద్దలందరూ మనతో కలిసి వింటే యిక చెప్పా ॥ ఆనందం! అందరి ఆనందమే.

పః- సరే! తల్లిదండ్రులారా! మేము చిన్నపిల్లలం. శ్రీరామకృష్ణ కథా గానం పాడుతున్నాం. శ్రద్ధగా విని, ఆనందించి, మాకు సంతోషాన్ని యివ్వండి.

1. సర్వమతంబుల సామరస్యమను
 శాంత్యుపదేశం బవసరమగుటన్
విశ్వమానవ సౌ భ్రాతృత్వము
 సుస్థిరపరచెను మన రామకృష్ణుడు ॥వి॥

పః- సర్వమతాలంటావే, ఏమిటి?

జః- మన మాతా వారు చెప్పలేదూ హిందూమతమనీ, క్రైస్తవమతమనీ, ఇంకా, యిలాగ ఎన్నో మతాలు లోకంలో ఉన్నాయి.

పః- ఉంటే?

జః- ఎవరి మతం వారికి గొప్పగా ఉండటం సహజంకదా!

పః- అవును. ఎవరి అమ్మ వారికి గొప్పకదా!

జః- కాని, మా అమ్మ గొప్పదని యితర్ల అమ్మను తిట్టవచ్చా?

పః- అబ్బే! తప్పు తప్పు. పాపంకూడా.

జః- కాని, అదే, ప్రపంచంలో ఎక్కువగా జరుగుతున్నదట!

పః- కాబట్టి?

జ:- కాబట్టి అన్ని మతాలను తెలుసుకొని, వాటివల్ల పొందే దేవు డొక్కడే అని అందరికి బోధించాలట!

ప:- అమ్మో! అది సాధ్యమా?

జ:- ఎందుకు కాదూ? సరియైన గొప్పదనం అదే! అలా చెప్పి తగాదాలే ఉండవు.

పి:- అయితే, యీ మతాలవల్ల తగాదాలుకూడా ఉన్నాయన్నమాట!

జ:- ఒక్క తగాదాలేమిటి? పెద్ద యుద్ధాలుకూడా జరిగాయట!

ప:- అందుచేత?

జ:- ఆ కార్యాన్ని సాధించి, ప్రపంచంలో ఉన్న మనుష్యులందరు ఒక్క భగవంతుని బిడ్డలే అని తెలియజెప్పటానికి మన రామ కృష్ణుడు పుట్టాడు.

ప:- అబ్బ! అంత గొప్ప పని కాదా?

జ:- అవును.

ప:- అయితే, ఆయనది మహా గొప్ప శక్తి అంటావా?

జ:- శక్తి ఆయనకుండటం కాదు. ఆయనే ఒక మహాశక్తి అంటే నమ్మె.

ప:- అంటే?

జ:- రాములవారి విషయం విన్నావుగా! శ్రీకృష్ణుడు తెలుసుగా! ఈ రెండు అవతారాలు ఒక్కటై, మన రామకృష్ణుడుగా పుట్టాడట!

ప:- అమ్మ! అవతారపురుషులే యిలా పుట్టారా?

జ:- ఒక్క అవతారాలే కాదు. వింటావుగా!

2. పదునెన్మిది నూర్ల ముప్పది యారన,
పదునేడవ తేది ఫిబవరి నెల
వంగరాష్ట్రమున కమార్పుకూరున
మంగళకర దీప్తులతో జనించెను ॥వి॥

3. పిత ఖుదిరాముడు మాత చంద్రమణి,
బ్రాహ్మణ ష్ఠులు పరమ పవిత్రులు
అనవరతము రఘువీరు గొల్చుచును
అనుపమ భక్తి చెలంగిరి ధన్యులు ॥వి॥

జ:- ఇప్పటికి 149 సంవత్సరాలకు పైగా, అంటే 1836 లో మన రామకృష్ణుడు పుట్టాడు.

ప:- అవును. ఆయన శిష్యుడు వివేకానందుడు పుట్టే 123 సంవత్సరములు దాటింది అన్నావుగా!

జ:- ఆ సంవత్సరం ఫిబ్రవరి 17 వ తేదీ ఆయన జన్మించాడు.

ప:- అయితే ఎక్కడ? అవును. బెంగాలు రాష్ట్రమని పూర్వం చెప్పావుగా?

జ:- అవును. ఆయన తల్లిదండ్రులు చంద్రామణీదేవి, ఖుదీరామ ఛటోపాధ్యాయులు.

ప:- అంటే, వీరెవరు?

జ:- బ్రాహ్మణులు, ఎంతో భక్తులు. చాల మంచివారని దేశం అంతా పేరుండేది.

ప:- అలాంటి తల్లిదండులకే యిట్టి మహాపురుషులు పుట్టుతారు కాబోలు!

4. ఏడవ నెలలో నుయ్యల నూపుచు
పాడుచున్న తన మాతృదేవికి
గడ్డమీసముల భావి రూపమును
గాంచ సె నత్యద్భుత లన్ ॥వి॥

5. ఒక దినమున గడు లిక నుండెడు
ఒక రోజున నతి భారదేహుడౌ
జోల పాటలకు బోరు పెట్టును
కాశి పాటలకు గురక బెట్టును ॥వి॥

6. కృష్ణ మేఘమున శ్వేత పక్షులను
గాంచి మైమరచు నేడవ యేటను
అజాయ దేవిని గాంచి సమాధిని
ఎన్మిదవ యేటనె పొందెనుసుండీ? ॥వి॥

7. కృష్ణుడ నేనని యానందించును ॥వి॥
రాధిక నేనని తన్మయుడగును
శివుని వేషమును భక్తి ధరించుచు
శివుడే తానై ధ్యానమగ్నుడగు ॥వి॥

జ:- అం కాదు. పుట్టినప్పటినుండి ఆ అవతార పురుషులు, తమ గొప్పదనాన్ని కొంచెం కొంచెంగా చూపిస్తూనే ఉంటారు.

ప:- పుట్టి ఏం చేశాడంటావు?

జ:- ఒకటేమిటి? అనేకంగా సి, తాను సామాన్యుడు కాదని తెలుపు తూనే ఉన్నాడు.

ప:- అవును. శ్రీకృష్ణుడు అలాగే కదా!

జ:- ఆ! అలా ! కాని రామకృష్ణునివి అన్నీ యింకా గొప్పవి. ఎందు చేతనంటే కృష్ణుడు దుష్టుల్ని శిక్షించటంకూడా పనిగా పెట్టుకుని దుర్మార్గుల్ని చంపాడు.

ప:- రామకృష్ణుడో?

జ:- అలా కాదు. మంచివాళ్ళను, చెడ్డవాళ్ళను బాగుచేసే పద్ధతి పెట్టుకుని, ఆ విధంగా గొప్పదనం చూపించాడు.

ప:- ఆ గొప్పదనం ఎలాంటిది?

జ:- అలా అడుగు. అడిగి తెలుసుకోవాలని అంటావుకదా! చిన్నప్పుడు యీ పిల్లవాడు నెలల వయస్సులోనే, ఒక దినం అమ్మ చంద్రా మణి పాలు యిస్తుండగా చాల బరువైపోయాడు. ఆమె తొడలు నలిగిపోయినంత పనైంది.

ప:- అబ్బ! అంత బరువే! తర్వాత?

జ:- అప్పుడు తండ్రి క్షుదీరాముడుకూడా ఆ పిల్లవాడిని ఎత్తుకోలేక పోయాడు.

ప:- ఆహా! అంత బరువన్నమాట!

జ:- అలాగే, ఒక రోజు అమిత లిక అయ్యేవాడు,

ప:- ఎందుచేతనంటావు?

జ:- అదే, మహాపురుషుల్లో ఉండే మహత్తు. మానవులకు అర్థంకాని వింతలు చేస్తుంటారు. అలా, , మరో రోజు అమ్మ, ఆ బాబాయిని నిద పుచ్చటానికి ఉయ్యాలలో పడుకోబెట్టి, ఊపుతూ పాడు తున్నది. అంతలోనే పసిపిల్లవాడు ఉయ్యాలలో లేడు.

ప్ర:- అమ్మయ్య! ఏమైనాడో!

జ:- విను. ఆ పిల్లవాడి స్థానంలో గడ్డాల వాడొకడు ఉన్నాడట!

ప్ర:- నాకు భయం వేస్తున్నది. ఆ గడ్డాలవాడు పిచ్చివాడేమో! అతడు మన రామకృష్ణుని ఏం చేశాడో!

జ:- అదికాదు జరిగింది. పిల్లవాడే ఆ పెద్దవాడిలాగా కనిపించాడట!

ప్ర:- ఏమిటీ! ఎంత ఆశ్చర్యం! తర్వాత?

జ:- ఆ పెద్దవాడెవరనుకున్నావు? పెద్దవాడైన తర్వాత మన రామకృష్ణ స్వరూపమే.

ప్ర:- ఆహా! ఏమి అద్భుతం! ముందు తానలా కాబోతున్నానని ముందుగానే అమ్మకు చూపించాడా మన రామకృష్ణుడు? చాలబాగుంది. తర్వాత?

జ:- మామూలు లాలిపాటలు పాడితే, ఏడుపు ఎక్కువ చేసేవాడు. కానీ పాటలు పాడితే మైమరచి నిదపోయేవాడు.

ప్ర:- పిల్లవాడుగాకూడా సామాన్యుడు కాదన్నమాట!

జ:- అంతేకాదు. విను. ఒకరోజు ఊరి బయటకు వెళ్ళాడు. అకస్మాత్తుగా ఆకాశంలో నల్లని మేఘం వేసింది. పెద్ద ఉరుముకూడా ఉరిమింది. భయంతో కొన్ని కొంగలు పైకి ఎగిరాయి. ఆ నల్లని మేఘంమీద, యీ తెల్లని కొంగలు, ఆ గదాధరునికి శ్రీకృష్ణుడు, అతని మెడలోని ముత్యాల దండలాగ కనిపించాయి. ఆనందం పట్టలేక మైమరచి పడిపోయాడు.

ప్ర:- ఏమీ! ఎంతో ఆశ్చర్యం!

జ:- అలాగే, ఒక దినం ప్రక్క ఊరిలో ఉన్న అణూరు కాళికాదేవిని కళ్ళారా చూచి తన్మయత్వం పొందాడు.

ప్ర:- బలే బాగుంది. ఇంకా చెప్పు.

జ:- ఇంకానా? ఇలాంటివి ఎన్నో! పిల్లల్ని వెంట తీసుకొని మామిడి తోటలోనికి వెళ్ళి, రాధాకృష్ణుల నాటకం ఆడేవాడు. తాను కృష్ణుడి వేషం వేస్తే, ఎంతో ఆనందంతో, నృత్యగీతాలతో తేలిపోయే వాడు. భక్తి ఎక్కువై, కృష్ణుని చూడాలని ఏడ్చిందట రాధ. అలాగే రాధిక వేషం వేస్తే, అలా ఎంతో ఏడ్చేసేవాడు మన రామకృష్ణుడు.

ప:- ఆహా! చాల గొప్పగా ఉంది. తర్వాత?

8. చదువకుంట సోదరుడు గదాధరు
చదివింపగ గలకత్తకు జేర్చెను
చదువడు గ్రంథము చెప్పిన వినడు
సంకీర్తనమున కాలము గడుపున్ ॥వి॥

9. దీని జూచి కోపించి సోదరుడు
దండింపగ నొక దినమున దమ్ముని
అశ్రుసంతతులు కన్నుల జారగ
అన్నను జూచుచు గద్గద స్వరమున ॥వి॥

10. పొట్టకూటి చదువులకో జన్మము!
పట్టుదలతో మాయిని జేరుటకో!
వ్యర్థ విద్యలకు నన్వేషించిన
బహ్మపదము - కూరునె యన్నా? ॥వి॥

11. అంత దక్షిణేశ్వరమున గా
పంపినమున బాజారి పదవిలో

రి, రామకుమారుడు తమ్ముని
కాశీకాలయమునకు గొంపోయెను. ॥వి॥

12. అధిక భక్తి గల బాలుని గాంచి
అధిపతి మధురుడు సంతోషించి
మహామాయి సన్నిధి పూజారిగ
నియమించెను కడు భక్తియుక్తుడై ॥వి॥

జః- ఇలా, ఆటపాటల్లో మునిగి ఉండే మన గదాధరుడికి చదువెలా వస్తుంది?

ప్ర:- గదాధరుడంటావేమిటి? రామకృష్ణుడు కాదా?

జః- రామకృష్ణుని, చిన్ననాడు గదాధరుడు అని, 'గదాయి' అని ముద్దుగా పిలిచేవాళ్ళు. పెద్దవాడైన తర్వాత యీ పేరు వచ్చింది.

ప్ర:- సరే! ఆ పిమ్మట ఏమైంది?

జః- ఇంటిదగ్గర గదాయికి భయం పెట్టి చదివించాలంటే నాన్న చనిపోయాడు, ఇక తల్లి అంటే, ముద్దు.

ప్ర:- పాపం! క్షుదీరాముడు చనిపోయాడా?

జః- అందుచేత, పెద్దన్న రామకుమారుడు తనతోపాటు గదాధరుని కలకత్తాకు తీసుకొని వచ్చి, తన సంస్కృత పాఠశాలలో ర్చి, చదువు చెప్పుతూ ఉండేవాడు.

ప్ర:- అయితే, అన్న చాల మంచివా !

జః- అవును! కాని ప్రయోజనం?

ప్ర:- ఏమైంది?

జ:- గదాయి చదివితేగా! ఎప్పుడూ ఒక్కడే కూర్చోటం, ఏవో పాడుకోటం, ఏడుస్తూ ఉండటం.

ప:- పాపం! నాన్న చనిపోయె! అమ్మకూడా దగ్గర లేకపోయె! అందుచేత దిగులు కాబోలు!

జ:- అది కాదు. కాళికాదేవినిగూర్చి పాడుకుంటూ, ఆమె కనపడలేదని ఏడిచేవాడు.

ప్ర:- అబ్బ! ఎంత భక్తో!

జ:- అందుకు, అన్నకు కోపం వచ్చింది. ఒక రోజు తమ్ముడిని ఒక లెంపకాయ కొట్టాడు.

ప:- ఆ ఆ, ఏమిటి! మన రామకృష్ణుడినే! పాపాత్ముడు, కొట్టాడా?

జ:- అలా కాదు! గదాధరుడు చదువుసంధ్యలు లేక ఉంటే, ప్రపంచంలో ఎట్టి ది ఎలాగ అని బాధపడి, పెద్దవాడు కాబట్టి ఒక దెబ్బ కొట్టాడు.

ప:- తర్వాత?

జ:- గదాధరుడికి కళ్ళనుండి నీరు చెక్కిళ్ళవెంట కారాయి,

ప్ర:- పాపం! ఎంత దెబ్బ తగిలిందో!

జ:- అయినా ఆ మహాత్ముడు అన్నను చూచి, 'అన్నా! ఎంతో చదువుకున్నావుకదా! ఈ చదువులు నన్ను అమ్మ కాళికను చూచేటట్లు చేస్తాయా?' అని ప్రశ్నించాడు,

ప:- బలే ప్రశ్న. పెద్దవాళ్ళకైనా తట్టదు.

జ:- 'ఈ చదువులన్నీ వ్యర్థంకదా!' అని అన్నను నిలదీసి అడిగాడు.

ప్ర:- అన్న ఏమన్నాడు?

జ:- ఇంక అనేదేముంది? సత్యాన్ని అంటకుండా తెలుసుకుని, తర్వాత శ్రీరామకృష్ణుని భక్తి అభివృద్ధికే సహాయం చేశాడు.

ప:- బలే! అట్లా ఉండాలి భక్తి అంటే. ఎంతటివాళ్ళయినా దానికి లొంగాల్సిందే!

జ:- అదేగదా, ప్రహ్లాద, ధృవ, మార్కండేయ చరిత్రల్లో వినం చూస్తాం.

ప్ర:- అటుపిమ్మట?

జ:- కలకత్తా దగ్గర, గంగ ఒడ్డున ఉన్న దక్షిణేశ్వరీ కాళికాలయంలో అర్చకత్వానికి వెళ్తూ, రామకుమారుడు తమ్ముడినికూడా వెంట సుకొని వెళ్ళాడు.

ప:- తమాషే! ఇంతకూ, ఏ కాళికాదేవిని చూడాలని చిన్నప్పటినుండి ఏడుస్తున్నాడో, ఆ కాళికాదేవి దగ్గరికే చేరాడన్నమాట!

జ:- అంత కాకుండా, ఆ దేవాలయ అధికారి మధురబాబట! అతడు యీ అబ్బాయి భక్తికి ఎంతో పొంగి, అమ్మవారి దగ్గర పూజారిగా కూడా ఏర్పాటు చేశాడు!

ప:- అదృష్టం అలా ఉండాలి.

13. 'అహా! చేరితి మాయి పావనకె'

అని సమ్మోదము జెందుచు బాలుడు

దక్షిణేశ్వరీ దర్శన ప్రాప్తికి

క్షించుచు నుండెను పావనుడు ॥వి॥

14. 'ఎన్ని పూజలను చేసినగానీ
ఎంత ధ్యానమొనరించినగానీ
కానిపింపవు నా తల్లి యదేమొ!
తనయుడగానో! తల్లివిగావో!' ॥వి॥

15. అని యరచుచు హృది చెక్కలుకాగా
దీనభావమతి దీనత బొంద
ఏడ్చి మైమరచి నేల దొరలును
ఏమియు దోచక నేల మోదు తల ॥వి॥

16. 'అయ్యో! తల్లీ! కాలము గడచెనె
మరియొక దినమిట వ్యర్థమయ్యెనే'
అని దుఃఖమునకు దాళజాలక
'హా దేవీ' యని దేవిని జేరెను ॥వి॥

17. ఇక నా జన్మము వ్యర్థముసుమ్మి
ఈగతి నేనిక బతుకజాల'
అని ఖడ్గముచే రామకృష్ణుడు
ఆత్మహత్య పూనెనుసుండీ! ॥వి॥

జ:- అలా చేరిన గదాధరుడు, ఎంతో ఆనందంతో పూజలు చేసేవాడు. 'అమ్మ దగ్గరకు చేరానుకదా! ఆమె నాకు కనిపిస్తుంది' అని ఎంతో ఆశతో ఉన్నాడు.

ప:- అయి , అలా కాలేదా?

జ:- అలా వెంటనే కనిపిస్తే మన గదాధరుడు రామకృష్ణుడు అయ్యేవాడు కాదు.

ప:_ ఎందు త?

జ:_ 'కనిపించు అమ్మా' అంటే ముందొచ్చి కూర్చుంటుందా ఏమిటి భగవతి? ఎన్నో పరీక్షలు చేయాలి? భక్తిని పరీక్షించాలిగదా!

ప:_ అవును? పూర్వం ప్రహ్లాదుడు ఎన్ని బాధలు పడ్డాడు పాపం!

జ:_ 'ఎన్ని పూజలు చేస్తున్నాను. ఎంతకాలం ధ్యానం, తపం చేస్తున్నాను. అమ్మ కనిపించదే! నాలో లోపం ఉన్నదా? సరిగా పూజలు చేయటం లేదా? లేక ఆమెకు నాపై ప్రేమ లేదా?' అని చింతించి చింతించి, తట్టుకోలేక ఎలుగెత్తి ఏడిచేవాడు.

ప్ర:_ అబ్బ! అమ్మ ప్రేమ ఏమైందో!

జ:_ ఒక్కొక్కసారి నేలమీద పడి, దొర్లి, నేలమీద తలకాయ కొట్టుకుంటూ రోదనం చేసేవాడు.

ప:_ అబ్బ! నాకుకూడా ఏడుపు వస్తున్నది.

జ:_ 'వాళ్ళమ్మ మరణించటంచేత అతడు అలా ఏడుస్తున్నాడేమో' అని అందరు అనుకునేవాళ్ళు.

ప:_ అయితే, కాళికా దేవి కనిపించలేదా?

జ:_ కనిపించకపోతే మన రామకృష్ణుడు యింతవాడెలా అవుతాడు? విను.

ప:_ సరే! త్వరగా చెప్పు. ఏడుపు వస్తున్నది.

జ:_ ఇలా కాలం దొర్లుకుపోతుంటే ఊరుకోలేకపోయాడు రామకృష్ణుడు. భక్తి అతి అయిపోయింది.

ప్ర:_ ఏం? అఘాత్యం చేశాడేమిటి?

జ:- కాళికాదేవి దగ్గరకు వెళ్ళాడు. ఆమె చేతిలో ఉన్న కత్తిని లాక్కున్నాడు. 'ఇక నేను బ్రతకటం ఎందుకు' అని అరిచాడు. ఆ కత్తితో తన కంఠాన్ని నరికేసుకోబోయాడు రామకృష్ణుడు.

ప:- అబ్బ! నేను చూడలేను.

18. దక్షిణేశ్వరీ ప్రేమావతారిణీ
మందహాస చంద్రికలల్లాడ
మధుర భాషణము ముఖమున రాల
దర్శనమిచ్చెను రామకృష్ణునకు ॥వీ॥

జ:- అలాగే ఆ మహానుభావుని కళ్ళుకూడా మూతలుపడ్డాయి. కత్తి ంచకు జారిపోయింది. అమ్మ ఎంతో ప్రేమతో ఆయనకు కని పించి మాట్లాడింది.

ప:- అబ్బ! నా గుండె దడ యిప్పటికి తగ్గింది. ఆమె కనపడకపో మన రామకృష్ణుడు ఏమయ్యేవాడో! నాకు చాల భయం వేసింది.

19. నాటి గోలె నా భవతరణీమణి
నిత్యదర్శనంబిచ్చుచు బల్కుచు
రామకృష్ణగురు నిత్యానంద సు
ధామునిఁ జేసెను ప్రేమమూర్తియై ॥వీ॥

ప్ర:- భ! అంటే భ! శభాష్ రామకృష్ణా! కాళిని సాధించావు. నీకు నమస్కారమయ్యా బాబూ! నీకు రోజూ కనిపించేదా?

జ:- రోజూ ఏమిటి? ఎప్పుడు కావాలంటే అప్పు .

20. అంత నా ప్రభుని భక్తి ప్రవాహినుల
నరికట్టుటకై తల్లియు నన్నయు,
జయరామవటి నా గ్రామ కన్య యగు
శారదామణిని పెండ్లి చేసిరి ॥వి॥

21. శారదా దేవియు విషయములంటక
గురుచరణంబుల గొల్చి ధన్యయై
భక్తులకెల్లను మాతృదేవియై
ప్రతిభ చెలంగెను అనుభవమహిమన్ ॥వి॥

జ:- అంతా బాగానే ఉంది. కాని రామకృష్ణుని సొంత అమ్మ, ఎవరు?

ప్ర:- చంద్రామణి.

జ:- చాల విచారించింది. కొడుకు పిచ్చివాడై పోతున్నాడని అను కుంది. ఈ పిచ్చి మార్చాలని ఆలోచించింది 'ఎలాగ' అని. పెళ్ళి చేస్తే పిచ్చి కుదురుతుందని అందరూ సలహా చెప్పారు ఆమెకు.

ప్ర:- ఆ! పాపం! ఆయన భక్తిని చెడగొట్టాలనే?

జ:- కాని అది సాధ్యమా?

ప్ర:- అయితే, తర్వాత ఏమైందేమిటి?

జ:- చంద్రామ దేవి పిల్లకోసం చూచింది. కాని పిచ్చివాడని పేరు మోసిన యీ రామకృష్ణుడికి ఎవరు యిస్తారు పిల్లను?

ప:- అవును మరి!

జ:- కాని రామకృష్ణుడు ఆలోచించాడు. అమ్మను తృప్తి పరచాలని తలంపు, అలాగని తాను చెడిపోగూడదని సంకల్పం.

ప్ర:- రెండూ ఎలాగ?

జ:- అదే ఆయన చేసింది. తన దివ్య దృష్టితో చూచాడు.

ప్ర:- అంటే?

జ:- ఈ రెండు కళ్ళతో చూస్తే, యీ ముందున్న లోకంమాత్రం కనిపిస్తుంది. అలాకాక గొప్పవాళ్ళకు లోపల యింకొక కన్ను ఉంటుందట! దానితో చూస్తే ముందున్నవేకాక, దూరంగా ఉన్నవి, పూర్వం ఉన్నవి, యిక ముందు కాలంలో జరిగేవికూడా వాళ్ళకు కనిపిస్తాయట!

ప్ర:- ఎంతో బాగుంది యీ రహస్యం. అది మన రామకృష్ణుడికి ఉన్నదా? అవును. ఆయన మహాపురుషుల్లో మహాపురుషుడుకదా?

జ:- అవును. జయరామవటి అనే గ్రామంలో, రామచంద్ర ముఖోపాధ్యాయ అనే బ్రాహ్మణునికి ఒక కూతురున్నది. ఆమె పేరే శ్రీ శారదామణీదేవి. ఆ పిల్ల తనకు భార్య అవుతుందని తన తల్లితో చెప్పాడు రామకృష్ణుడు.

ప:- మన శారదమాయే!

జ:- అవును. పోయి అడిగారు, ఎంతో సంతోషంగా ఒప్పుకున్నారు ఆ తల్లిదండ్రులు. ఇంకా చిత్రం ఏమిటంటే, ఆ చిన్నపిల్ల కూడా చేసుకుంటానన్నదట?

ప:- అయి , అప్పుడు మన శారదామాయికి ఎన్ని ఏండ్లు?

జ:- 5 సంవత్సరాలు! ఇంకా వింత చూడు. మన రామకృష్ణునికి 23 ఏండ్లు.

ప్ర:- తర్వాత?

జ:– శ్రీరామకృష్ణుని భార్యగా చేరిన మన శారదాదేవి మామూలు భార్య కాలేదు.

ప్ర:– కాక ఏమైంది?

జ:– శ్రీరామకృష్ణుని మాట సకారం నడుచుకొని, ఆయన తల్లి అయి కూర్చుంది,

ప:– అంటే?

జ:– ప్రపంచంలో ఉండే అందరు భార్యలలాగ కాక, ఆమె రామ కృష్ణునితోపాటు గొప్ప తపస్సు చేసింది. శ్రీరామకృష్ణునికే ఆశ్చర్యం కలి అనుభవ స్థితిలో ఉండేది.

ప:– అమ్మ! ఎంత అసాధ్యురాలు!

జ:– అం కాదు, ఒక దినం శ్రీరామకృష్ణ ఆమెకు పూజ చేసి, తన తపస్సునంతా ఆమె పాదాలదగ్గర అర్పించాడట!

ప్ర:– భర్త, భార్యకు పూజ చేశాడా?

జ:– ఇంకా వాళ్ళు భార్యభర్తలేమిటి? అలా అనటం తప్పు. పాపం కూడా!

ప:– ఏమనాలి అయి ?

జ:– బిడ్డ, తల్లి అనాలి. ఆమె ఆయనకు తల్లి. వలం తల్లేకాదు. కాళికాదేవియే!

ప:– అలాగా! అద్భుతమే!

జ:– అలాగే ఆయన ఆమెకు తల్లి. కాళికాదేవియే!

ప్ర:- మగవాడుగా?

జ:- అదే శారదలో ఉన్న గొప్పదనం. మగవాడిని, అందులో భర్తను, తల్లిగా భావించి, స్మరించి, దర్శించింది.

ప్ర:- ఇలాగ, పూర్వం ఎక్కడైనా జరిగిందా?

జ:- లేదు లేదు. మున్మాటికి లేదు. ఈలాంటి దాంపత్యం ఎక్కడా, ఎన్నడూ లేదు.

ప్ర:- అదేమిటి? మరల దాంపత్యం అన్నావేమిటి?

జ:- పొరపాటు. ఇలాంటి సంఘటన అంటే చాలు. సంఘటన అంటే కూడిక అన్నమాట!

ప్ర:- ఇదికూడా మహా అదృష్టం. అలా కలిసిరావాలి. అదే వీళ్ళలో ఉన్న గొప్పదనం అని తెలుసుకున్నాను.

22. అంత గురుడు భైరవి బ్రాహ్మణి కడ
హానికరమ్ములు కష్టసాధ్యములు
అరువది నాలుగు తంత్రమార్గముల
నవలీలగ సాధించె శక్తిమై ॥వి॥

23. రామభక్తుడగు జటధారిని గని
రామభక్తిని సాధించుటచే
రామా యని పిల్వగ శ్రీరాముడు
రామలాలుడై కన్పడి యాడును. ॥వి॥

24. మధుర, సఖ్యముల ననుభవింపగ
రాధిక తానై విరహవేదనల

కృష్ణా యని ఎలుగెత్తి పిల్వగా
కృష్ణకిశోరుడు నాట్యము సల్పెను ॥వి॥

25. దాస్యభావమున మారుతి గాంచెను
ప్రస్తవంబు సాధించె తిరా తుల
ఇస్లాముని మరి మూడు దినములన్
ఏకదీక్షమై తత్త్వమెరింగిన్ ॥వి॥

26. తోతాపురి నా యతివరు సన్నిధి
అద్వైత జ్ఞానమును పొందుచు
సర్వాధ్యాత్మిక గమ్యము నాబడు
నిర్వికల్పమున నుండె త్రిరాత్రులు ॥వి॥

జః– ఇంకా విచి తాలున్నాయి విను. అప్పుడే ఏమి తెలుసుకున్నట్లు?

పః– చెప్పు మరి?

జః– ఒక్క కాళికాదేవి భక్తితో సాధించిన కాళికా అమ్మవారి దర్శనంతో, మన రామకృష్ణుడు తృప్తి పొందలేదుగా!

పః– అయి ఏం చేశాడు?

జః– ఆయన చేసేదేమిటి? అంతా ఆ భగవతి కాళికమాయి సంకల్పం.

ప్రః– అయితే, కాళికాదేవి ఏమి చేసింది?

జః– మన రామకృష్ణుడిని అలా తృప్తిపడనివ్వలేదు. ప్రపంచంలో ఎన్ని మతాలున్నయ్యో అన్నింటిని మన రామకృష్ణుడు తెలుసుకోవాలట?

పః– అబ్బ! అది సాధ్యమా? తాను కనిపించటానికే అంత ఏడిపించింది గదా! ఇంకా ఎందుకు ఆయనను బాధించటం?

జః— మొదట్లోనే చెప్పానుగదా! మతాలు ఎన్నో ఉన్నాయని. కాని ఆ మతాలకు ఆధారం అయిన 'అనుభవం' లోకంలో పోయింది. అందుచేత పోట్లాటలు ఎక్కువ అయ్యాయి, కాబట్టి అన్ని మతాల సారాన్ని తెలిసి బోధించాలిగదా!

ప్రః— బాగుంది ఆమె సంకల్పం. తర్వాత?

జః— అపర దేవీ సంకల్పం కాబట్టి, ఎక్కడెక్కడి గురువులూ, అన్ని మతాల గురువులు, తమంతట తామే మన రామకృష్ణుని దగ్గరకు వచ్చారు.

ప్రః— శిష్యులు గురువును ఆశ్రయించాలటగా! కాని శిష్యుడైన రామ కృష్ణుడికోసం గురువులే వచ్చారా?

జః— అవును. అలా భైరవి బ్రాహ్మణి గిరి అనే ఒక బాల సన్న్యాసిని, ఆయన దగ్గరకు వచ్చింది.

పః— ఆడవాళ్ళుకూడా సన్న్యాసం పుచ్చుకుంటారా?

జః— పిచ్చివాడా! మన మాతాజీలేరా మరి!

ప్రః— అవును మరచాను. ఆ కాలంలోకూడా ఆడవాళ్ళు యిలా సన్న్యా సుల్లో కలిసేవాళ్ళా?

జః— మన దేశంలో ఎప్పుడూ అంతే! ఆడవాళ్ళలో అనేకమంది గొప్ప సన్న్యాసులు ఉన్నారని మాతాజీ మొన్న ఎవరితోనో చెప్పుతున్నారు.

పః— సరే! ఆమె వచ్చి ఏం సింది?

జః- శాక్తేయం అంటారట! అది ఒక మతం. దాని సంబంధం 64 సాధనలట! అన్నింటిని ఆమె బోధించి చేయించిందట మన రామకృష్ణుడిచేత.

ప:- ఇదీ ఒక విశేషమే!

జః- అలాగే జటధారి అని ఒక వైష్ణవ సాధువు వచ్చి రామభక్తి చెప్పాడట! దాన్ని మన రామకృష్ణుడు చేస్తే, రాముడు చిన్న పిల్లవాడుగా రామకృష్ణుడితో ఆడుకొనేవాడట!

ప్ర:- రామచంద్రుడే! ఎంత గొప్పదనం!

జః- కృష్ణుని భక్తురాలు రాధాదేవి ఉండేదట! ఆమె ఎంతో భక్తురాలట! ఆమెలాగా కృష్ణ భక్తి చేశాడట రామకృష్ణుడు. దానితో కృష్ణుడు చిన్న పిల్లవాడులాగా ఎదుట ఆ వాడట!

ప్ర:- ఎంత అదృష్టం! అందరు దేవతలు మన రామకృష్ణుడి ముందు ఉండే వాళ్ళన్నమాట!

జః- అవును. శ్రీ కాళికాదేవి దయవల్ల మన రామకృష్ణుడు ఆంజనేయుని, సీతాదేవిని, యింకా ఎందరో దేవతల దర్శించాడు. చర్చికి వెళ్ళి ఏసుక్రీస్తు మతాన్నికూడా అనుసరించాడు. మూడు రోజులలో ఏసుప్రభువు కనిపించి, మన రామకృష్ణుడిలో కలిసి పోయాడు.

ప్ర:- అది మన మతం కాదుగా!

జః- మళ్ళా మొదటికి వచ్చావు. ముందే చెప్పానుగా అన్ని మతాల్ని తెలుసుకోవాలని.

ప్ర:- సరే! తర్వాత?

జః— అలాగే ఇస్లాము మతాన్ని అవలంబించాడు. మసీదుకుకూడా వెళ్ళవాడు. దాన్నికూడా బాగా గ్రహించాడు. ఇలాగ ప్రపంచంలో ఉన్న ముఖ్య మతాల్ని అనుసరించాడు, అనుభవించాడు. మన రామకృష్ణుడు.

ప్రః— అబ్బ! ఎంత ఓర్పో!

జః— అదే ఆయన గొప్పదనం మరి. అమ్మ అను గ్రహం ఉంటే అన్నీ సాధ్యమేగా!

ప్రః— అన్నీ పూర్తి అయ్యాయిగా! ఇక శాంతి పొందాడా?

జః— లేదు. అన్ని మతాలకు, సాధనలకు మించిన మహోక పద్ధతి ఉందట! దాన్నే అద్వైతం అంటారుట! దాన్ని యిక తెలుసుకోవాలి. అది చాల కష్టం!

ప్రః— మరి ఏం చేశాడు?

జః— అమ్మే, ఒక దిగంబర సన్న్యాసిని మన రామకృష్ణుని దగ్గరకు రప్పించిందట!

ప్రః— ఎవరాతడు?

జః— తోతాపురి అని చాల గొప్ప సన్న్యాసి. అతడు వచ్చి, శ్రీరామకృష్ణునికి సన్న్యాసం యిచ్చి, ఆ అద్వైతాన్ని బోధించాడు.

ప్రః— సన్న్యాసం ఎందుకు?

జః— సన్న్యాసికిగాని ఆ అద్వైతంలో ఉండే అనుభవం రాదట! చదువుకోవచ్చునుగాని అనుభవం రావాలంటే సన్న్యాసం ఉండాలని ఆతడి నమ్మకమట!

ప్ర:- అంతట ఏమి జరిగింది?

జ:- గురువుగారు చెప్పటంతోనే గ్రహించుకొని శిష్యుడు వరుసగా మూడు రోజులు మైమరచి కూర్చుండిపోయాడు.

ప్ర:- అలాగా! మూడు రోజులే!

జ:- గురువుగారు శిష్యుడిని, మరల ప్రపంచంలోకి తీసుకొని రాక పోతే అలాగే ఉండిపోయేవాడట!

ప్ర:- అంటే గురువుకంటే శిష్యుడు చాల గొప్పవాడన్నమాట?

జ:- ఆ గురువు 40 సంవత్సరాలు తపస్సు చేస్తే ఆ అనుభవం వచ్చిం దట! దాన్నే నిర్వికల్ప సమాధి అంటారట!

ప్ర:- అబ్బ! ఎంత సాధించాడో! ఆయన సాధించనిది యింక ఏదీ లేదన్నమాట!

జ:- అవును. ఢంకామీద దెబ్బ కొట్టి మన అనుభవానందులు, దృఢంగా చెప్పుతున్నారు.

ప్ర:- అటుపిమ్మట ఏమి జరిగింది?

27. పండితపామరులేకమైరి యట
పేదలు ధనవంతులును కలిసిరి
సర్వ జాతులును సర్వ మతస్థులు
సర్వ వర్ణములు భక్తితో  రిరి ॥వి॥

28. విద్యావంతులు యువకులనేకులు
లౌకిక జీవితమెల్ల త్యజించి,
ఏక నిష్ఠతో రామకృష్ణునే
గుర్వోత్తమునిగ నమ్మి గొల్చిరి ॥వి॥

జ:- పూర్వం రామకృష్ణుడి దగ్గరకు అనేక గురువులు వచ్చారన్నా నుగా! ఇప్పుడు శిష్యులు అనేకులు చేరారు.

ప్ర:- అయితే రామకృష్ణునిలో మార్పు వచ్చిందన్నమాట! ఇంతకాలం శిష్యుడుగా ఉన్నవాడు గురువైనాడంటావు!

జ:- గురువా? ఆ మాట సరిపోదు. జగత్తుకే గురువు ఆయన. అంటే జగద్గురువు.

ప్ర:- అదా 'జగద్గురువు శ్రీరామకృష్ణ దేవునికి జై' అంటారు?

జ:- అవును. గురువంటే సాధన రహస్యాలన్నీ తెలిసి, శిష్యులను పైకి తీసుకొనివచ్చే పద్ధతి తెలిసి వుండాలి. ఎంతో ప్రేమ ఉండాలి. అలాంటి లక్షణాలు మన రామకృష్ణునిలో బండ్లకుగా ఉన్నాయి.

ప్ర:- అదే విన్నాను. ఎంతోమంది ఆయన దగ్గర చేరారటగా!

జ:- అందర్నీ తన అపార ప్రేమతో చూస్తూ, వాళ్ళ శ్రేయస్సుకై యత్నిస్తాడు కాబట్టి అందరూ ఆయనను చేరారు. మహాపండితులు వచ్చినా వారికంటె మన రామకృష్ణుడిలో ఆధిక్యం గోచరించేది.

ప్ర:- అయి, ఎంతటివాడైనా ఆయనకు దాసోహం అన్నాడంటావు.

జ:- ఒకర్ని, ఎక్కువగా, ఒకర్ని తక్కువగా చూచేవాడు కాదు.

ప్ర:- అంత విశాలమైన ప్రేమ అన్నమాట! అంత ప్రేమ అందరికీ ఉంటుందా?

జ:- అదే మరి ఆయన ప్రత్యేకత. అందు తడబ్బున్నవాళ్ళు లేని వాళ్ళు, చదువుకున్నవాళ్ళు లేనివాళ్ళు, అన్ని కులాలు, ఆడ, మగ, పిన్న, పెద్ద ఒకటేమిటి; అందరూ ఆయన పాదాల దగ్గరుండి తన్మయులైపోతూ ఉండేవారు!

ప:- ఎంతో గొప్పదనమే. యి ఎత్తి నమస్కారం చేస్తాను!

జ:- ఆనాడు గొప్ప పేరులో ఉన్న కేశవచం దసేన్ , ఈశ్వరచంద్ర విద్యాసాగర్. గిరీశచం ద ఘోష్, అలాంటి గొప్పవాళ్ళెందరో ఆయన వెంట ఉం వాళ్ళు.

ప్ర:- చేరి ఏం చేశారు?

జ:- ముక్తి పొందటానికి సరియైన మార్గం తెలుసుకున్నారు. సాధన అంటే ఏమిటో గ్రహించుకొన్నారు.

ప:- అప్పుడేనా, మన వివేకానందుడుకూడా చేరింది?

జ:- అవును. అప్పుడు అతని పేరు న ం దనాథుడని చెప్పానుగా! అతడొక్క కాదు. ఇంకా ఎందరో అలాంటి కు రవాళ్ళు గొప్ప తెలివి, చదువు, డబ్బు ఉన్నవాళ్ళు ఆయనకు శిష్యులుగా చేరాు.

ప:- ఎంత అదృష్టం!

జ:- చేరి, ఎప్పుడు యింటికి వె ళ్ళవారోగాని, ఎప్పుడూ రాత్రి అనక పగలనక గురువుగారి దగ్గరుండి, ఆయన మాటప్రకారం తపస్సు చేశారు. ఎంతో గొప్పవారైనారు.

ప్ర:- అవును. వివేకానందుడి విషయం చూచాముగా!

29. పదునెన్మిది నూర్ల ఎనుబదియారున
పదునారవ తేదీ అగష్టు నెలలో
రామకృష్ణుడు తన యవతారము
లయమొనరించెను మహాసమాధిలో ॥వి॥

జ:- కాని, ఆ జగద్గురువు అలా, ఎంతో కాలం ఉండలేదు. తనకు 50 సంవత్సరాలు దాటగానే శరీరం చాలించాడు.

ప్ర:- ఆ బ్రహ్మదేవుడు యిలా ఎందుకు వ్రాస్తాడు? మంచివాళ్ళను ఎక్కువ కాలం ఉంచడేం?

జ:- గొప్పవాళ్ళు, తాము అనుకున్న పని త్వరగా ముగించుకుని వెళ్ళిపోతారు. 'మన పని అయిందికదా! యింక ఎందుకుండటం?' అనుకుంటారు.

ప్ర:- అలాగా! అయినా వాళ్ళు అలా అందర్నీ వదలిపోతుంటే ఎందరు ఏడ్చారో! అబ్బ! తలుచుకుంటేనే ఏడుపు వస్తుంది.

జ:- అవును. సామాన్యుడు పోతేనే దుఃఖం కలుగుతుంది. ఇక అట్టి మహాత్ములు పోతే, దేశం అంతా ఏడుస్తుంది. ఆనాడు వేలుగా జనం వచ్చి, కింద పడి దొర్లి ఏడ్చారు.

ప్ర:- పాపం! మనం చూడకపోయినా ఏడుపు పొర్లి వస్తుంటే, ఎంత దుఃఖమో!

20. యతివరుడగు శ్రీరామకృష్ణుని
ప్రథమ శిష్యుడౌ నరేంద్రనాథుని
అనుసరించుచు యువక బృందము
మునిగణములతో వన్నెకెక్కిరి ॥వి॥

31. ఈరీతిని పదునేడ్గురు యువకులు
సర్వసంగ సన్న్యాసమొనర్చి
శ్రీరామకృష్ణుని పేరుతో మఠమును
స్థాపించిరి దమ యనంతశక్తిని ॥వి॥

32. వివేకానందుని నాయకత్వమున
సద్గురు సందేశమ్ముల జాటుచు
నగణిత భక్తులకాత్మశాంతిని
భగవానుని కృప నందజేసిరి ॥వి॥

జ:- అలా ఏడ్చి ఏడ్చి, కుర్రవాళ్ళు నరేంద్రనాథుని నాయకత్వంలో ఇల్లు వాకిలీ తల్లి తండ్రి అంతా వదలి, గురువుగారి మార్గాన్ని అనుసరించి, దేశంలో బోధించటానికి సన్న్యాసం తీసుకున్నారు.

ప:- అవును. అట్టివారి శిష్యులు ఎంత గొప్పవారైనా అవుతారు, అలాగేగా నరేంద్రుడు వివేకానందుడై ఎంతో గొప్ప పని చేశాడు!

జ:- మత ప్రచారానికి తగినట్లుగా, శ్రీ రామకృష్ణ మఠాన్ని కూడా స్థాపించారు.

ప:- అవును. విన్నాగా! దానికి ఎంతో గౌరవం ప్రపంచంలో ఉన్నదిగదా!

జ:- ఎందుచేతనంటావు? వీరు ఎంతో చదువుకున్నవారు. ఇతర్ల సుఖంకోసం ఎప్పుడూ కృషి చేస్తుంటారు,

ప్ర:- అదేగా మరి సన్న్యాసి లక్షణం!

33. సర్వవిధమ్ముల నీ యవతారము
సర్వోత్కృష్టము సర్వాతీతము
సర్వమానవ పుణ్యకారణము
నవ్య భారత భాగ్యవిశేషము ॥వి॥

34. ముక్తిధామమే భువికరుదెంచెనో!
భువియే స్వర్గస్థానమయ్యెనో!

అనుభవానందములొక్క పెట్టున
అనుపమముగా ప్రవహించెనునుండీ! ॥వి॥

ప:- అలాగైతే దేశానికి, ప్రపంచానికి యింత గొప్పగా ఉపయోగ పడిన సన్న్యాసి యింకెవరూ లేరేమో!

జ:- ఇదివరకు మహాగురువులు అన్నవాళ్ళు, మహా అయితే, వందల మందికి ఉపయోగం అయ్యారేమో! కాని మన రామకృష్ణుడు, లక్షలకు, కోట్లకుగా భక్తులకు మార్గదర్శి అయ్యాడు.

ప:- అవును. జగద్గురువు అన్నావుగా!

జ:- అలా కాదు? జగద్గురువులైనా కొంతమంది ఉపయోగం అవుతారు. కాని మన రామకృష్ణుని ప్రత్యేకత వేరు.

ప:- ఎలాగంటావు?

జ:- ఏ గురువైనా ఒక పద్ధతినే అనుసరించి బోధించాడు. కాని మన రామకృష్ణుడు, అన్నింటికి అవసరమైన మూల సూత్రాలను బోధించాడు, ఆచరించి చూపాడు.

ప:- అవును. క్రీస్తుమతం. బౌద్ధమతం, మహమ్మదీయ మతం, అన్నీ ఆచరించాడుగా! అందుచేత అన్ని మతాలవారికి ఉపయోగం అయ్యాడన్నమాట! ఇక ఎంతమందికి ఆధారం అయినాడో చెప్పా !

జ:- అవును. అంత గొప్పవాడు యింకెవరూ లేరనే అంటారు।

ప:- అలాగా!

జః- అంతేకాదు. ఆయనను అనుభవ అవతారం అంటారు. అందుచేత మన లోకానికే మోక్షం వచ్చిందంటే నమ్ము. లేక మన ప్రపంచమే ముక్తి పదవి అయినట్లుంది.

ప్రః- ఎందుచేతనంటావు?

జః- ఏవో రెండు గ్రంథాలు చదివి బోధించే వాళ్ళకంటె అనుభవం సంపాదించి, యితర్లకు దారి చూపేవాళ్ళు ఎక్కువైనారు.

పః- అవును. అదేగదా నేటి ప్రపంచానికి అవసరం!

25. జయ రామకృష్ణా! కృపాసము దా!
జయ పరమాత్మా! జగదాధారా!
ఓంకారరూపా! త్రికలాపా!
ఓం నమో శ్రీ రామకృష్ణాయ ॥ జ ॥

ధర్మోద్ధారక జగద్గురో? జయ
శ్రీ రామకృష్ణా! నమో నమో!
సాధక గురువర! నమో నమో జయ
బోధ స్వరూపా! నమో నమో!
అవతారవర్య! నమో నమో జయ
అనుభవపూజిత! నమో నమో!
క్షుదీరామసుత నమోఽస్తు తే
మునిజనవంద్య నమోఽస్తు తే
మోక్ష ప్రదాతా నమోఽస్తు తే.......

జగద్గురు శ్రీరామకృష్ణదేవునికి జయ్

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

ఓం

# శ్రీ వివేకానంద కథాగానము

పెద్దలారా! 1963 వ సంవత్సరం చాల గొప్పది సుమా!

ప:- ఎందు కు?

జ:- ఇన్ని సంవత్సరములనుండి, మనం పూజిస్తూ ఉన్న శ్రీ రామ కృష్ణ దేవుని ముఖ్య శిష్యుడు, శ్రీ వివేకానంద స్వాములవారు పుట్టి నూరు సంవత్సరాలైంది.

ప:- అబ్బా! నూరు సంవత్సరాలే! అయితే పూర్వం ఎందరో పుట్ట లేదా? వీరి పుట్టినరోజు యింత గొప్పగా ఎందుకు చెయ్యాలి?

జ:- ఒక్క పుట్టినరోజే కాదు. పుట్టిన సంవత్సరం అని, ఆ సంవత్సరం అంతా పండుగ చేశారు.

ప్ర:- సంవత్సరం అంతా?

జ:- ఆ. ఒక్క దేశమే కాదు. ప్రపంచం అంతా, అన్ని దేశాలు, ఆ స్వాములవారి పుట్టిన సంవత్సరం చాల ఘనంగా చేశారు.

ప:- అయితే, యిప్పుడు నీవు చెప్పేదేమిటి?

జ:- ఇంతమంది ఆయన విషయం వినటానికి వచ్చారు.

ప్ర:- అయి ?

జ:- శ్రీ వివేకానంద స్వామివారి జీవిత చరిత్రను, అందరికి తెలిసే ట్లు మనం చెప్పాలట!

ప:- అయ్యబాబోయ్!

జ:- ఫరవాలేదు. మన శ్రీ అనుభవానంద స్వాములవారు, శ్రీ వివేకా నందుని జీవితాన్ని, చిన్న కథాగానంగా మనకు వ్రాసి యిచ్చా రుగా! దాన్ని చెప్పుదాం.

ప:- అనుభవానంద స్వాములవారు ఎవరు? వారినిగూర్చి కొంచెం చెప్పు.

జ:- చెప్పుతాను విను. శ్రీ అనుభవానంద స్వామి 1908 వ సంవత్స రంలో గుంటూరు జిల్లాలో జన్మించారు. చిన్నతనంనుండి శ్రీ రామకృష్ణ దేవుని అనుసరించేవారు. రెండు ఆశ్రమాలు పెట్టారు. అనేక కీర్తనలు, పద్యాలేగాక చాలా పుస్తకాలుకూడా వ్రాశారు. చక్కగా ఉపన్యాసాలు యిచ్చేవారు. బొమ్మలు తయారు చేసే వారు. బొమ్మలుకూడా వేసేవారు. పిల్లలతో ఆడుకునేవారు, బాగా చదువుకున్నవారు, ఒకటేమిటి? అన్ని విద్యలు వారికి వచ్చును.

ప్ర:- అబ్బా! ఒక్కరిలో అన్ని విద్యలుండటం ఆశ్చర్యమేసుమా!

జ:- అవును. అవి వారికి శ్రీరామకృష్ణుని అనుగ్రహంవల్ల వచ్చా యని చెప్పాలి. వారే యీ కథాగానాన్నికూడా వ్రాశారు. శ్రీ స్వాములవారు 1973 లో తమ భౌతిక దేహాన్ని చాలించారు,

ప్ర:- అలాగా! వారికి మనసారా నమస్కరించి, మనం కథ ప్రారంభం చేద్దాం.

జ:- సరే! అమ్మలారా! అయ్యలారా! మన శ్రీ అనుభవానందులు వ్రాసి యిచ్చిన యీ శ్రీ వివేకానంద జీవిత కథాగానాన్ని చిన్న పిల్లలం పాడుతున్నాం. మాట్లాడుకోకుండా, శ్రద్ధగా వినాలని మీ అందరినీ కోరుతున్నాం.

ఆర్యులార! వినుడీ! మన శ్రీ వివేకముని కథను
ఆలకింపుడీ! ఆనందింపుడీ! ఆ యాదర్శము ననుసరింపుడీ! ॥ఆ॥

1. అత్యద్భుతమది అనుపమానము
ఆత్మోన్నతికి రాజమార్గము
అఖండ భారత జ్ఞానసంపదకు
అద్వితీయమగు చిహ్నరత్నము ॥ఆ॥

2. భారతదేశపు పేరుప్రతిష్ఠల
స్థిరస్థాయిగా నిల్పినాడుగా!
అన్ని మతంబుల అనుభవసారము
అద్దై మింగిన గురుశిష్యుడుగా! ॥ఆ॥

ప్ర:- వివేకానందుడిలో గొప్ప ఏమిటంటావు?

జ:- మన భారత దేశం ప్రపంచంలో చాలా గొప్పది.

ప్ర:- ఆహా! అయితే ?

జ:- మానవుడు దేవుడు అయ్యే పద్ధతిని అది లోకానికి బోధించింది.

ప్ర:- అదంతా నాకెందుకు? స్వామివారి విషయం చెప్పు.

జః- అదే నేను చెప్పేది. మనదేశం గొప్పదనాన్ని తెలుసుకొని, వివేకానందుడు సన్న్యాసం పుచ్చుకుని, ఎందరికో మార్గం చూపాడోయ్!

ప్రః- అలాగా!

జః- అన్ని మతాలలో ఉన్న సారం తెలుసుకుని బోధించాడు.

3. జగదాచార్యుడు రామకృష్ణుని
సందేశంబుల భక్తితొ జాటగ
జన్మించిన శ్రీ వివేకానందుని
సత్కథ దెల్పగ నసాధ్యవకాగా ॥అ॥

4. సప్తమ లోకమునన్ వసించెడు
సప్తర్షులలో నొక్కడు సుమ్మా!
విశ్వనాథ శ్రీ భువనేశ్వరులకు
వెలసెనుగా శ్రీ వంగరాష్ట్రమున ॥అ॥

ప్రః- ఉండు ఉండు. సప్తమలోకం అంటావేమిటి?

జః- అవును. వివేకానందుని గురువుగారు రామకృష్ణుడు, వివేకానందుని సప్తమలోకంనుండి మన ప్రపంచంలోకి పిలుచుకుని వచ్చాడు,

ప్రః- ఎందుకు?

జః- ఇందాక చెప్పానుగా! లోకంలో మంచి పోయింది. చెడు ఎక్కువ అయింది. అందుచేత మంచిని అందరికి బోధించటానికి.

ప్రః- అయితే ఏం?

జః- అది అందరికి సాధ్యం కాదు. గొప్ప తెలివి ఉండాలిగా!

ప్రః- అందుకనా ఆ లోకంనుండి పిలిచింది?

జః- అవును.

ప్రః- తల్లి ఎవరు? తండ్రి ఎవరు?

జః- బెంగాలు రాష్ట్రంలో, కలకత్తా నగరంలో, క్షత్రియవంశానికి చెందిన విశ్వనాథ దత్తు తండ్రి. భువనేశ్వరీమాత తల్లి,

ప్రః- పేర్లు చాల బాగున్నాయి!

5. బాల్యదశ నేమని తెలుపుదు
ప్రాముఖ్యములతి పావనమౌగా!
ఆటపాటలలో నందని చెయ్యి
తోటి బాలురకు మేటి నాయకుడు. ॥అ॥

6. మల్లయుద్ధమున క పయుద్ధమున
ఎల్ల శక్తులలో ప్రబలుడుగా
సంగీతములో సాహిత్యములో
అసామాన్యుడు నరేంద్రనాథుడు ॥అ॥

ప్రః- ఓహో! పిల్లవాడుగాకూడా సామాన్యుడుగా లేడే?

జః- అవును. మన్ను తిన్న పాములాగా మందంగా ఉండేవాడు కాదు. అన్నిటిలో మొదటివాడే!

ప్రః- అల్లరిలోకూడా?

జః- ఓ! ఎంతో అల్లరిపిల్లవాడకూడా! అందర్నీ ఏడిపించి, ఏడు చెరువుల నీళ్ళు తాగించేవాడు.

ప్రః- చదువో?

జః- చదువే కాదు! కుస్తీ, గరడీ, సంగీతం ఒకటేమిటి? అన్ని విషయాల్లో, అతడే, అందరికంటె మొదటివాడంటే నమ్మ.

పః- తర్వాత?

7. భక్తి జ్ఞాన విరాగ కర్మములు
పరమోత్కృష్టములనుపమానములు
సాంబసదాశివు దివ్యనామమే
చలనరహిత నిశ్శబ్దమునందిడు. ॥అ॥

8. ఎల్లప్పుడును స్తోత్రగీతముల
నల్లనల్లన భక్తిపాడును
పురాణగాథల నత్యాదరమున
పూర్ణంబుగ విని ఆనందించును ॥అ॥

జః- ఎంతో భక్తి కూడా ఆయనకు ఉండేది. ధ్యానంలో కూర్చుండటం, ప్రార్థన గీతాలు పాడుకోవటం, పురాణాలు వినటంలోకూడా యీ అబ్బాయి ప్రథముడే!

పః- ఇంతకూ, యీ అబ్బాయి పేరు చెప్పలేదేమి?

జః- అవును. మరచాను. వివేకానందుడిని చిన్నప్పుడు 'నరేంద్రనాథ దత్త' అనేవాళ్ళు. ముద్దుగా 'నరేన్' అని పిలిచేవాళ్ళు?

పః- అబ్బ! పేరు ఎంతో బాగుంది నరేంద్రనాథుడు. అంటే నరులకు ఇంద్రుడంతటివాడన్నమాట!

జః- అవును.

ప్రః- 'దత్త' అన్నావేమిటి?

జః- 'దత్త' అంటే మనకు యింటి పేర్లు ఉండటం లేదూ? అలాగా వారి యింటి పేరు అది.

ప్ర:- సరే! తర్వాత ఏమైంది?

9. సీతారాముల ధ్యానము చేయుచు
ఐదవ ఏటనె ఆనందించును
మహాదేవుని మననము చేసి
ఇహమును మరచి తన్మయుడగును. ॥అ॥

10. పేదసాదలకు దానధర్మముల
ప్రేమభావమున సి మైమరచు,
సాధువర్యుల పూజ్య భావమున
సేవా తత్పరుడై చెలంగును ॥అ॥

జ:- ఆ అబ్బాయికి తల్లి ఉండలేదూ భువనేశ్వరీమాత?

ప్ర:- అవును.

జ:- ఆమె, పిల్లవాడికి రామాయణం, భారతం, భాగవతం, యిలాంటి పురాణాల్లో ఉన్న అనేక అవతారపురుషుల కథల్ని చెప్తూవుండేది.

ప్ర:- ఆమె, అంత మంచిది అన్నమాట!

జ:- అవును. తల్లే మనకు మొదటి గురువు. ఆమెవల్లనే మనకు, మంచి చెడు మొదట బోధపడుతుంది.

ప:- తం డి?

జ:- మనకు ఊహ తెలిసిన తర్వాత తం డి. మనం తల్లి దగ్గర చనువుగా ఉన్నట్లు తం డి దగ్గర చనువుగా చిన్నప్పుడుంటామా?

ప:- అవును. ఆమేకదా మనల్ని కని పెం ది. చిన్నప్పుడు ఆమె మనల్ని సరిగా చూడకపోతే, మన గ మి కావాలి?

జ:- అవును. 'మాతృదేవో భవ' అనికూడా మన శాస్త్రాలు చెప్పాయట!

ప్ర:- ఇక, అమ్మ మంచిదై ఉండాలికూడా.

జ:- అవును. అమ్మ మంచిదైతే పిల్లలుకూడా మంచి వారౌతారు. లేకపోతే చెడ్డవాళ్ళుగా వచ్చి రౌడీలుకూడా తయారవుతారు,

ప్ర:- అలాగా! మనకు అమ్మ చాల ముఖ్యం అన్నమాట! మంచి అమ్మ ఉండటంకూడా మన అదృష్టమే.

జ:- బాగ్గా అర్థం చేసుకున్నావు. అలాగ, నరేంద్రనాథుని తల్లి నిజంగా భువనేశ్వరీమాత అన్నమాటే! ఆమె ఒక దేవత. అందుచేత ఆమె పిల్లల్ని ఎంతో జాగత్తగా పెంచింది,

ప్ర:- సరే! అలా పురాణ గాథల నరేంద్రునికి చెప్పుతుండా? తర్వాత ఏమైంది?

జ:- అలా అడుగు. అమ్మ దగ్గర రామాయణం విన్నాడు. రామచంద్రుని గొప్పదనానికి ఎంతో సంతోషం పొందాడు. అమ్మ యిచ్చిన కాసీలు నిలుపు చేసి, సీతారాముల విగ్రహాలను కొన్నాడు.

ప్ర:- ఎందుకు?

జ:- తొందర పడతావేం? విను,

ప్ర:- తొందర కాదు. నరేంద్రుని గురించి బాగా వినాలని ఆతురత అన్నమాట. తర్వాత?

జ:- ఆ బొమ్మల్ని ముందు పెట్టుకొని, గదిలో కూర్చొని, ప్రపంచాన్నే మరచి, పొద్దుటి నుండి సాయంకాలంవరకు ఉండిపోయాడు.

ప:- అబ్బ! కాళ్ళు నొప్పి పుట్టలేదా?

జ:- అదే అతని గొప్పదనం. మనం అయితే కూర్చోలేము. కూర్చో పెట్టితే మనకు కోదండం వేసినట్లే! ఎంతో బాధ.

ప్ర:- లోకాన్ని ఎలా మరిచిపోయాడంటావు?

జ:- అతని మనస్సు సీతారాముల ధ్యానంలో మునిగిపోయిందన్న మాట!

ప్ర:- అబ్బ! చాలకష్టం. చిన్నతనంలోనే అతడలా ఉన్నాడన్నమాట!

జ:- అంతేకాదు. పేదవాళ్ళకు, సాధువులకు, అన్నం గుడ్డలు యిచ్చి, ఆదరిస్తూ ఆనందిస్తూ ఉండేవాడుకూడా.

11. కాని ఈశ్వరుని గాంచకుంటచే
కుళ్ళి క్రుగ్గి కడు స్రుక్కిపోయెను
వాశాంతియె తాండవింపగా
దిక్కులు పగులగ నేడ్చుచుండును ॥ఆ॥

12. దారితోచక శవచంద్రుని
దేవేం దనాథుని రినగాని
తృప్తినొందక దిరిగి చివరకు
తాపముతో శ్రీ రామకృష్ణు గనె ॥ఆ॥

జ:- అంతేకాకుండా నరేం దునికి భక్తి ఎక్కువగా ఉండేది. దేవుడిని చూడాలని కాంక్ష ఎక్కువ. అందుచేత దేవుడిని చూడాలని తాప తయపడ్డాడు. కాని అది అంత సులభమా?

ప్ర:- అవును. పూర్వం మన ఋషులు ఎన్నో సంవత్సరాలు అడవుల్లో తపస్సు చే వారట దేవుడికోసం!

జః_ కాబట్టి యీ కు రవాడు 'చూడాలి రా' అంటే దేవుడు వస్తాడా?

పః_ నిజమే, కష్టం,

జః_ అందుచేత దేవుడిని చూచే మార్గం ఎవరు చెప్పుతారా అని వెదక టం మొదలుపెట్టాడు.

పః_ ఎవరూ చెప్పలేదా?

జః_ ఆ రోజుల్లో దేవేంద్రనాథ టాకూరు అని చాల గొప్ప మహర్షి ఉండేవాడు. ఆయనను, ఆయనకు శిష్యుడైన కేశవచంద్రసేన్‌ని అడిగాడు. కాని లాభం లేకపోయింది.

పః_ పాపం! ఎవరూ చెప్పలేదన్నమాట!

జః_ అందుచేత, ఆ అబ్బాయికి ఆనందంలేకపోగా ఏడుపు వచ్చేది. ఒక్కడే కూర్చుని ఎక్కువగా ఏడ్చేవాడు.

ప్రః_ అలాగైతే. యింత గొప్పవాడెలాగ అయ్యాడు?

జః_ చెప్పుతాను విను.

పః_ అయితే మార్గం దొరికిందన్నమాట!

జః_ లేకపోతే ఎలాగ? మన రామకృష్ణ పరమహంస దేవుని విషయం విన్నాడు.

13. గంగాయమునలు కలిసినట్లుగా
కృష్ణార్జున సంయోగముచందము
పూర్వాదునములు పాశ్చాత్యములు
కలిసినచందము ఏకమైరిగదః ॥అ॥

14. నాటనుండి సద్గురు ప్రబోధల
    సాటిలేనటుల ననుసరించెను
    మేటి సాధనల నెన్నో సెను
    పటుతరమై గురు ప్రేమ చూరగొనె ॥అ॥

15. ద్వైతాద్వైతపు సిద్ధాంతంబుల
    సాధన సంపదలన్ని గడించి,
    రామకృష్ణ గురు శిష్యగణమ్ముల
    రాణించెను గద ముఖ్య శిష్యుడై ॥అ॥

ప:– అదికూడా అదృష్టమే.

జ:– అదే మరి రహస్యం పెద్దవాళ్ళ విశాలలో. అనేక అదృష్టాలు వాళ్ళకి కలిసివస్తాయి.

ప్ర:– ఈ రామకృష్ణుడు ఎవరు? ఎక్కడ ఉం వాడు? ఆయన విషయం ఏమిటి?

జ:– చంపావు. అదొక అద్భుత చరిత. అర్థం సుకోవటమే కష్టం. ఇక చెప్పటం ఎలాగ?

ప్ర:– కొంచెంగా చెప్పకపోతే ఎలాగ?

జ:– సరే! బెంగాలు రాష్ట్రంలోనే, కామార్పుకూరిణి అనే గ్రామములో, క్షుదీరామ ఛటోపాధ్యాయ, చంద్రామణిదేవి అనే బ్రాహ్మణ దంపతులుండేవారు. ఎంతో భక్తులు. మంచివాళ్ళు. వాళ్ళకు మూడో కొడుకు శ్రీ రామకృష్ణుడు.

ప:– మరి నరేంద్రుడు కలకత్తాలోగా ఉండటం?

జః- అవును. రామకృష్ణుడు చిన్నతనంలో అన్నగారితో కలకత్తాకు వచ్చి, కలకత్తా దగ్గర నాలుగు మైళ్ళ దూరంలో, గంగ ఒడ్డున ఉన్న దక్షిణేశ్వరీ కాళికాలయంలో పూజారిగా చేశాడు.

ప్రః- ఆహా! చాల అద్భుతంగా ఉందే!

జః- అక్కడే, శ్రీ రామకృష్ణుడు ఎంతో తపస్సు చేసి, ఎంతో గొప్ప వాడై పోయాడు.

ప్రః- అలాగా!

జః- ఆ రోజుల్లో ఎందరో విద్యావంతులు, సన్యాసులు, దిగంబరులు, ధనికులు అందరు ఆయన పాదాల దగ్గర ఉం వారు.

పః- అబ్బా! అంత గొప్పవాడా?

జః- ఏమిటి ఆయన గొప్పదనం! మొదటే చెప్పానుగదా, ఆయనను అర్థం చేసుకోటం కష్టమని.

ప్రః- తర్వాత?

జః- ఏడ్చి ఏడ్చి, గురువుకోసం వెతకి వెతకి, వేసారి, నరేంద్రుడు చివరికి యిక్కడికి చేరాడు. గంగాయమునలలాగ కలిసిపోయారు వారిద్దరు. ఆయన చెప్పినట్లు ఎంతో సాధన చేశాడు. శ్రీ రామ కృష్ణుని చేరిన అంతమంది శిష్యులలో మొదటివాడుగా తయా రయ్యాడు.

ప్రః- అంటే బలే గురువు, బలే శిష్యుడు అన్నమాట!

జః- అవును. అలాంటి గురుశిష్యులనుండే గొప్ప విషయాలు బయటు పడతాయి. దేశం బాగుపడుతుంది.

ప్రః- తర్వాత ఏమైంది?

16. శ్రీరామకృష్ణుని మహాసమాధితో
శేషమైన వైరాగ్యము తోడుత
సన్న్యసించి మన నరేం దనాథుడు
స్వామి వివేకానందుడయ్యెను. ॥అ॥

జః- శ్రీరామకృష్ణుడు శరీరం చాలించాడు. నరేంద్రునికి సంసారంమీద పూర్వం ఉన్న విరాగం ఎక్కువైంది. 'ఎందుకు యీ సంసారం?' అనుకున్నాడు. సన్న్యాసం స్వీకరించి శ్రీ వివేకానందుడయ్యాడు.

17. అంత దేశమున పాదచారియై
అరుగుచు హిమనగసేతువరకును
దివ్య తముల తీర్థమ్ముల జని
తీ వ యోచనల మునిగిపోయెను. ॥అ॥

18. పూర్వాదునముల తారతమ్యము
పూర్తిగ నాతని ముందు నిలిచెను
కన్నుల నీరు కాల్వలు గట్టెను
ఖిన్నాభిన్నము హృదయమాయెను. ॥అ॥

19. ధనధాన్యంబుల నుయ్యాలలూగిన
జ్ఞాన జమున ప్రకాశించిన
చ కవర్తుల పతిభల నిండిన
శూరగాథలతో బూర్తిగ నున్న ॥అ॥

20. భారతదేశపు భాగ్యజ్యోతులు
సారవిహీనత జల్లారినవి

దీని గాంచు నే భారతీయునికి
దుఃఖము పొంగదు? హృదయము పగులద? ॥అ॥

21. భారత దేశము పూర్వోన్నత్యను
పొంది తీరవలె పతిభ చెలగవలె
అనుచు తీ వముగ నాలోచించి
అకుంఠితంబగు దీక్ష వహించెను ॥అ॥

జః- అలా సన్న్యాసియై, మన దేశంలో ఉం మహా తాలు, తీర్థాలు అన్నీ తిరిగాడు. ఎంతమంది మహాత్ములనో చేరి సేవించాడు. దేశం అంతా తిరిగాడు.

ప్రః- ఎందుకు?

జః- సన్న్యాసి అలా తిరగాలి. తిరిగి అనేక విషయాలు తెలిసి, కష్టసుఖాల అనుభవం కలుగుతుంది. అలా తిరిగి అనుభవం సంపా దించిన సన్న్యాసులనే 'పరమహంస పరి వాజకాచార్య' అంటారు.

ప్రః- వివేకానందుడు దేశాలు తిరిగి ఏం చేశాడు?

జః- పూర్వకాలం, మన దేశంలో ఉం మహా ఋషులు, అవతార పురుషులు, యింకా ఎందరో మహాపురుషులు ఆయనకు జ్ఞాపకం వచ్చారు. ఆ కాలంలో మన దేశం ఎంతో ఆనందంగా ఉండేది.

పః- ఇప్పుడో?

జః- చూస్తున్నావుగదా! ఎవరికి సుఖం వుంది? అందు త, వివేకా నందుడు ఆలోచించి, మరల మన దేశం పూర్వస్థితిని పొందాలని అనుకున్నాడు, ఆవేదన చెందాడు.

ప్ర:- ఏదో చెయ్యాలికాని ఆవేదనపల్ల లాభం ఏమిటి?

జ:- అదే ఆయన చేసింది.

22. కన్యాకుమారి యాదేశము గొని
కల్పవృక్షమగు గురు యాజ్ఞను గొని
హనుమంతునివలె జలధి దాటెను
అవలీలగ నత డమెరిక కెగెను ॥ఆ॥

23. అఖిల ప్రపంచపు మతసమ్మేళన
మందు ప్రముఖుడై యుపన్యసించెను
ఆశ్చర్యంబున బండితలోకము
అమరవాణి యని కీర్తించిరిగా ॥ఆ॥

24. చికాగో పురిలో ప్రారంభించిన
శ్రీ వివేకుని ఉపన్యాసములు
పాశ్చాత్యమును బూర్తి ముంచెను
భారత జ్ఞానము ప్రకాశించెను. ॥ఆ॥

25. మహోపన్యాసము లగణితంబులు
మఠ స్థాపనలు-విరివిగ సాగెను
శిష్యులధికముగ నా శయించిరి
స్థిరమగు కీర్తిని జేపట్టెను భళి ॥ఆ॥

జ:- అలాగా, నేటి మన దేశ దీనస్థితికి చింతించి, ఆవేదనతో దేశం అంతా తిరిగి తిరిగి, మన దేశానికి దక్షిణంగా చివరి భాగం అయి, మన భారతమాతకు పాదాలగు కన్యాకుమారికి రాడు.

ప్ర:- చేరి?

జ:- సముద్రంలో ఉన్న ఒక చిన్న కొండపై ధ్యానంలో కూర్చు న్నాడు.

ప్ర:- తర్వాత ఏమైంది?

జ:- ఆ తపస్సులో శ్రీ కన్యాకుమారి దర్శనం యిచ్చింది.

ప్ర:- దేవి కనిపించిందా?

జ:- అవును. కనిపించి, ఆయనలో బాధను తెలుసుకున్నది కాబట్టి, అమెరికా వెళ్ళి, మొదట వేదాంతాన్ని అక్కడ బోధించమన్నది.

ప్ర:- అక్కడ ఎందుకు?

జ:- ప్రపంచానికి అంతా ఆ దేశం డబ్బులో చాల గొప్పది. అంతే కాక ఆ దేశంవాళ్ళకు ప్రపంచంలో మంచి పలుకుబడి ఉంది.

ప్ర:- అంటే, అమెరికావాళ్ళు మంచివాళ్లైయితే ప్రపంచం అంతా మారుతుందనా భావం?

జ:- అవును.

ప్ర:- అయి , వెళ్ళాడన్నమాట.

జ:- ఆ. వెళ్ళాడు, క్షేత్రి మహారాజు డబ్బు యిచ్చి పంపాడు.

ప్ర:- వెళ్ళి?

జ:- అక్కడ పెద్ద సభ జరిగింది. ఆ సభకు అన్ని మతాల గురువులు వేలకుగా చేరారు.

ప్ర:- అయి , చాల ముఖ్యమైన సభ అన్నమాట.

జః- ఆ సభలో మన వివేకానందుడు మాట్లాడేటప్పటికి, అందరు ముగ్ధులయ్యారు. ఆనందించారు. ఎంతో పొగిడారు. అంతవాడు యింక ఎవడూ లేడని ఎంతో, ఎన్నో స్తుతించారు,

ప్ర:- తర్వాత ఏమి చేశాడు?

జః- ఎన్నో మఠాలు స్థాపించాడు. ఎందరో శిష్యులయ్యారు.

ప్ర:- చాలా గొప్ప పనే! తర్వాత?

26. కొందర శిష్యుల వెంట తీసుకొని
సంతోషంబున భారతి చేరగ,
మాతృదేశమున బ్రవేశించెను
మహానుభావుడు శ్రీ వివేకయతి ॥అ॥

27. ఇచ్చట జరిగిన సన్మానంబులు
ఇచ్చట కలిగిన సమ్మోదంబులు
ఇచ్చట నిండిన మంగళరవములు
ఉచ్చరింపగా నేరికి సాధ్యము? ॥అ॥

28. లక్షల జనములు చుట్టును చేరిరి
రాజులె బండిని చేతలాగిరి
జయ ధ్వానములు దిక్కులు నిండెను
సన్మానంబులు అగణితంబులు ॥అ॥

29. శ్రీరామకృష్ణుని మహిమ స్మరించి
శ్రీరామకృష్ణ మఠ స్థాపనము
స్వామి వివేకానందుడు సలిపెను
సన్న్యాసులకై స్థిరస్థాయిగా ॥అ॥

జః- మరల మన దేశానికి తిరిగి వచ్చాడు. వెంట కొందరు శిష్యులు స్త్రీలు, పురుషులు వచ్చారు.

ప్రః- అంత గొప్ప పని చేసి వివేకానందుడు మన దేశం వస్తే, మన దేశంవాళ్ళు ఎంత ఆనందించారో!

జః- మనవాళ్ళ ఆనందానికి మితం లేదు. ఎన్నో సన్మానాలు జరిగాయి. లక్షలకు పైగా జనం చుట్టూ చేరారు. ఊరేగింపులు జరిగాయి. ఆయనను బండిమీద కూర్చోపెట్టి, మహారాజులే ఆ బండిని లాగారు. ఎంత గొప్పగానో ఆయనను గౌరవించారు.

ప్రః- అట్టి గౌరవం పూర్వం ఎవరికి జరగలేదంటావు.

జః- అవును. జరగలేదు. అదీగాక ఒక సన్న్యాసికి మున్నెన్నడు జరగలేదు.

ప్రః- అయి మన దేశానికి ఆయన ఏం చేశాడు?

జః- మన దేశానికి గొప్ప గౌరవం ప్రపంచంలో సంపాదించిపెట్టాడు గదా! అం కాదు. మన దేశంలో సన్న్యాసులకు శ్రీరామ కృష్ణ మఠాన్ని స్థాపించాడు.

ప్రః- ఆ మఠానికి గురువుగారి పేరే పెట్టాడన్నమాట!

జః- అవును. ఆ గురు అనుగ్రహంవల్లనే యీ ఘనకార్యం అంతా జరిగింది అని ఆయన నమ్మకం. అందు త ఆ పేరే పెట్టాడు.

ప్రః- ఈ సన్న్యాసులు ఎందుకు?

జః- వారు మంచిని సాధించి సత్పురుషులు కావటమేకాక దేశానికి ఎంతో సహాయం శారు.

జ:- ఎలాగ?

జ:- వరదలు వచ్చి ప్రజలు బాధలు పడుతూ ఉంటే అట్టి జనులకు అన్ని సహాయాలు స్తారు, పిల్లలు చదువుకోటానికి ఆదర్శమైన విద్యాలయాలు పెట్టారు. అనేక ఆసుపత్రులు పెట్టి పేద జనులకు ఉచితంగా మందులు యిస్తున్నారు. ఇలాగ ఎన్నో విధాలుగా యీ సన్న్యాసులు దేశానికి ఉపయోగపడుతున్నారు.

ప్ర:- మత ప్రబోధ?

జ:- తమ సాధన చేసుకుంటూ, తమ అనుభవాల్ని ప్రజల్లో ప్రచారం సి, మత ప్రచారం సంఘంలో చేస్తున్నారు వీరు.

ప్ర:- వీరి మతం ఏమిటి?

జ:- అన్ని మతాలవల్ల గమ్యం పొందేది ఒక్క దేవుడే అనిగదా శ్రీరామకృష్ణుని ప్రబోధ! అదే వీరు ప్రచారం చేస్తారు, ఆచరిస్తారు.

ప్ర:- అయితే, వీరు చాల మంచి సన్న్యాసులన్నమాట!

జ:- మరేమిటనుకున్నావు?

30, గురు సంకల్పము కార్యదీక్షతో
చరితార్థత గావించి మహాత్ముడు
ముప్పది తొమ్మిది వత్సరంబులు
పూర్తి కాగనే ముక్తి జెందెను ॥అ॥

31. భారతీయ ఋషి సం ప్రదాయము
ప్రకాశించెను అతని ప్రతిభతో
శ్రీ మద్వివేకానందుని మార్గము
అవలంబించుటె మన కర్తవ్యము ॥అ॥

జః- ఈ విధంగా మన దేశానికి, మొత్తం ప్రపంచానికి ఎంతో మేలు చేసిన మన వివేకానందుడు ఎక్కువ కాలం జీవించలేదుగదా!

పః- మనం ఎంత దురదృష్టవంతులం! ఆయనను చేరి, సేవించే మహాభాగ్యం మనకు లేకపోయిందిగదా! ఆ మహాత్ముని చూచే భాగ్యంకూడా మనకు దక్కలేదుకదా!

జః- ఇంత చేసిన ఆ మహానుభావుడు, 39 సంవత్సరాలు నిండినతర్వాత మననుండి దూరమైపోయినాడు. తను చేసిన పని 'చాలు' అనుకున్నాడేమో! భగవంతునిలో కలిసిపోయినాడు.

పః- అయితే మన గతి ఎలాగ?

జః- ఆయన శరీరం మనకు లేదు కాని ఆయన ఆదర్శం మనముందున్నది. ఆయన చెప్పిన, చేసిన విషయాల్ని తెలుసుకుని అనుసరిస్తే మనంకూడా అదృష్టవంతులం కాగలం. అదే మన కర్తవ్యం, మన విధి.

32. భారత సంస్కృతి ప్రస్ఫుటరూపా!
భారతీయ యతివర్య ప్రతాపా!
యతిసార్వభౌమా! అసమానధామా!
విద్యాసాగర! వివేకానంద! ॥అ॥

రామకృష్ణా త నమో నమో జయ
కామవిదూరా నమో నమో!
రామకృష్ణ ప్రియ నమో నమో జయ
కామవి తా నమో నమో?
రామకృష్ణ జ్ఞాన నమో నమో జయ
ఆత్మోద్ధారక నమో నమో!

విశ్వనాథ సుత నమోస్తుతే
విరాగరూపా నమోస్తు తే
వివేకమునివర నమోస్తు తే.

శ్రీ వివేకానంద స్వామికి, జయ్

హరిః ఓం తత్ సత్

# సమన్వయానుభవానందము

శ్రీ అనుభవానందస్వామి గొప్ప మహనీయులు. వారు బాల్యము నుండి సర్వానుభవమూర్తి అయిన శ్రీ రామకృష్ణదేవుని అనుయాయులు. అందుచేతనే వారి "శ్రీ రామకృష్ణ లా సంకీర్తనం", "శ్రీ రామకృష్ణ పూజ" శ్రీ రామకృష్ణుని సర్వమత సామరస్యాన్ని - గొప్పదనాన్ని చాటి చెప్పుతాయి. వారు ఆ శ్రీ రామకృష్ణ దేవునికై ఎంత ఆవేదన చెందారో తెలియ స్తాయి వారి "శ్రీరామకృష్ణాంజలి" "దక్షిణేశ్వరీ స్తవము"లు. ఈ రెండింటిని శ్రీ స్వామీజీ తమ కళాశాల విద్యాభ్యాస సమయంలోనే వాసుకున్నారు. సాధనలో మనస్సు ముఖ్యం కాబట్టి లోకం పోకడను మనస్సుకు తెలియ స్తుంది "చిత్త ప్రబోధ". అ సాధన లోకంనుండి పారంభమై, శాస్త్రంతో పూర్తి అని చెప్పుతుంది "సాధనసుధ". ఆ సాధన సమాధివరకు - యాలని బోధిస్తుంది "సాధన రహస్యం". ఆ సాధనానుభవమే "అనుభవానందం". ఆ అనుభవానందాన్ని పొందినవాడు లోకంలో సర్వంతెలిసి మెలుగుతాడని "సాధన మకరందం" చెప్పుతుంది. ఆ అనుభవం కల్గితే సర్వ సిద్ధాంత సమన్వయం కరతలామలకం అంటుంది "సర్వ సిద్ధాంత సౌరభం". ఆ సర్వం అంటే సాధననుండి సిద్ధత్వం వరకు నాలోనే ఉన్నవి అంటుంది "మాండూక్య రసాయనం". ఆపై సాధనానుభవాలన్నీ "శ్రీ రామకృష్ణ, శారద, వివేకానంద, అనుభవానందా దర్శము" లలో గ్రహించి, సిద్ధత్వాన్ని పొంది, "శాంతి సామాజ్యా"న్ని అనుభవిస్తాడు.



చదవండి ;                    గమ్యాన్ని పొందండి !!

ఎనిమిది ముద్రణలు పొంది, పత్రికల,

పండితుల, ప్రముఖుల ప్రశంసలు పొంది,

ఆధ్యాత్మిక గ్రంథ ప్రచురణములలోనే

అపూర్వ సంచలనము కల్గించిన మహోజ్జ్వల

గ్రంథరాజము.



# సాధన రహస్యము



పరమహంస పరివ్రాజకాచార్య

## శ్రీశ్రీశ్రీ అనుభవానంద స్వామి

వారిచే, సులభ శైలిలో తెలుగు భాషలో

రచింపబడిన, సర్వసాధకులకు అపూర్వ కానుక.



